"పల్లెటూరు గ్రంథమండలి" I

మొదటి పుస్తకము.

# గాంధిమహాత్ముని నీతిమంజరి.



గ్రంథకర్త:

ముడిగంటి జగ్గన్న శాస్త్రి.

పల్లెటూరు గ్రంథమండలి.

# గాంధిమహాత్ముని నీతిమంజరి.





మూడవకూర్పు 2000 ప్రతులు.

సంపాదకులు:

ముదిగంటి జగ్గన్నశాస్త్రి,

తణుకు. పశ్చిమగోదావరి.

1933

వెల 0-2-0.

# గాంధిమహాత్ముని నీతిమంజరి



## ఆరోగ్యము.

శీలము లేని మానవుడు ఆరోగ్యవంతుడు కాజాలడు. మలినమైన మనస్సు శరీరమునుకూడ మలినభూయిష్ఠము గావించుట తప్పదు.

/ / / / /

ఇప్పటి నాగరికత నిర్మలవాయువునకుకూడ కరవు తెచ్చిపెట్టెను. మంచిగాలిని పీల్చుటకు మనము పట్టణములను వీడి దూరము పోవలెను. అనగా ధనవ్యయము చేయవలెను. గాలిని కొనవలెను

/ / / / /

ప్రతి నూరురోగములలోను తొంబది రోగములవరకు దుర్వాయువే మూలకారణ మని చెప్పుట కెంతమాత్రము సంశయము లేదు.

/ / / / /

వేలకొలది రోగులు సూర్యాతపమునకును, విశుద్ధ వాయువునకును, విడిచిపెట్టబడుటచే నిరోగులగుట మనము గాంచుట లేదా ?

/ / / / / .

మనలో నిరంతరము ఆత్మకును, అనాత్మకును (సైతానునకును) దేవాసురయుద్ధము జరుగుచునేయున్నది. ఈపోరులో ఆత్మజయించెనేని శరీరము సదా మంచికార్యములనే చేయుటకు సాధన మగును. సయితానే జయము నొందెనా! శరీరము అనేక దుర్వ్యాపారములకు నిలయ మగును.

ॽ ॽ ॽ ॽ ॽ

సయితానును ధిక్కరించి భగవంతుని చట్టములను పాలించినపుడే మనము పరిపూర్ణారోగ్యవంతుల మగుదుము.

ॽ ॽ ॽ ॽ ॽ

నేను నాజీవిత మంతయు అస్ఖలిత బ్రహ్మచారిగనే యుంటినేని యిప్పటికంటె వేయిరెట్లు ఎక్కువ జవసత్త్వములను కార్యోత్సాహమును కలిగియుందునని నాదృఢవిశ్వాసము. నాకును నాదేశమునకునుగూడ నేనెంతయో యుపకారినై యుండెడివాడను.

ॽ ॽ ॽ ॽ ॽ

మానవుడు తిండికొరకే సృష్టింప బడలేదు. అతడు తిండికొరకే తన జీవితమును గడుపతగదు. సృష్టికర్తను తెలిసికొని యతనిని సేవించుటయే మానవుని కర్తవ్యము. భగవత్సేవకే శరీరము అవుసరము గావున దానిని నిలుపుకొనుటకే మనము తినవలెను. నాస్తికులు కూడ మన యారోగ్య

రక్షణకు కావలసినంత మాత్రమే తినవలెనని యొప్పుకొనెదరు.

| | | | |

జిహ్వను కట్టినవాడు తదితర యింద్రియములను కట్టుట సులువు.

| | | | |

తిండి విషయములో మన మెన్నెన్నియో అనవసరమగు కోరికలకు దాసులమైతిమి. మన తిండిపోతుతనమును దానికి దాసులమగుటను మన మింకను గుర్తింపలేకనే యున్నారము.

| | | | |

భార్యపోయిన మానవుడును, భర్తపోయిన స్త్రీయును, తిరుగ వివాహమాడరాదని ఆరోగ్యశాస్త్రము శాసించుచున్నది.

| | | | |

మన నిత్యజీవితమునకును మన యారోగ్యమునకును నెంతయో సంబంధమున్నది. మనము పరిశుద్ధ జీవితమును గడిపినగాని పూర్ణారోగ్యమును బడయజాలము.

| | | | |

భగవంతుడు మన కీశరీరము నెట్టి శుద్ధావస్థలో నొసగెనో యట్లే యతని కొప్పగించుటకు మన మెప్పుడును మన బాహ్యాభ్యంతర శుచిని కాపాడుకొనవలెను. మన సంబం

ధమును ఆతని యిచ్ఛానుసారముగ నెరవేర్చితిమేని మనకతఁడు అమరత్వమునే ప్రసాదించగలడు.

॥ ॥ ॥ ॥ ॥

అన్ని పరిశ్రమలలోను కాలినడక రాణియైయున్నది. ఫకీరులు, సాధువులు సాధారణముగ బలముగ నుండుటకు ముఖ్యకారణము వారు దేశమంతయు కాలినడకను తిరిగి వచ్చుటయే.

॥ ॥ ॥ ॥ ॥

ప్రకృతియే మనకు చర్మమను దివ్యమైన యాచ్ఛాదన మొసంగెను. దుస్తులు లేనపుడు శరీర మందవికారముగ నుండుననుకొనుట పొరపాటు.

॥ ॥ ॥ ॥ ॥

అస్ఖలిత బ్రహ్మచర్యము లేనిదే స్త్రీపురుషు లెన్నటికిని సంపూర్ణజవసత్త్వములతోను మానవ కళతోను శోభించ జాలరు.

॥ ॥ ॥ ॥ ॥

శరీరము పరిపూర్ణాభివృద్ధినిగాంచి తరుణవయస్సుదాటినతరువాత మానవుడు రోజునకు రెండుసార్లుకన్న ఎక్కువ తినుట ఎంతమాత్రము అవసరము లేదు.

॥ ॥ ॥ ॥ ॥

P S Narayana



గాలి, నీరు, ఆహారము, మనకెంత ముఖ్యావసరములో నిత్యశరీరపరిశ్రమకూడ సంపూర్ణారోగ్యమున కంతప్రాముఖ్యము.

। । । । ।

శరీరమానసికముల విజృంభణమునకు తోడ్పడు పరిశ్రమయే ఆదర్శప్రాయమైన పరిశ్రమ. అదియే మానవునికి నిజమైన ఆరోగ్యము నొసగగలదు. వ్యవసాయదారే పూర్ణారోగ్యవంతుడు.

। । । । ।

నారుపోసినవాడు నీరుపోయును. మన పోషణకు తగినంత ఆహారమును ప్రకృతియే కల్పించుకొనుచుండును. గనుకనే తన భాగమునకు కావలసిన దానికి మించి తీసికొనువాడు యితరులభాగమునుండి లాగుకొనుచున్న వాడగుచున్నాడు.

। । । । ।

శాస్త్రవేత్తలనేకమంది మానవుడు మాంసాహారి కావలెనని నిరూపించిరి. అతడన్ని కూరగాయులను కూడ తిననక్కరలేదు. కందమూల ఫలాదులే యాతని ముఖ్యాహారము.

। । । । ।

ఫలాహారమే యత్యుత్తమమని నాయనుభవమువల్లను అధ్యయనము వల్లను నేను తెలిసికొంటిని.

। । । । ।

శ్రీ [illegible]

తక్కువ తినుటవల్ల మన ఆరోగ్య మెన్నటికి చెడిపో నేరదు. మనము సాధారణముగ తిను నాహారమును తగ్గించుటయే అత్యవసరమైయున్నది.

, , , , ,

మన యారోగ్యమంతయు భోగములకొరకును విషయలోలతకొరకును మనశరీరమును జూచుకొని మురియుటకును లేక అదియే మోక్షమనుకొనుటకును కాదు. అయినచో చెడురక్తముతోనిండి క్రొవ్విన శరీరములతో మన మూరేగుటయే మంచిదగును.

, , , , ,

అన్నిమతములును శరీరము భగవంతుని నిలయమని చాటుచున్నవి. భగవంతునికి భక్తిశ్రద్ధలతో సేవచేయుటకే మన కీశరీరము ప్రసాదింపబడెను.

, , , , ,

శీలము మంచికార్యములపై ఆధారపడియున్నది మంచికార్యము లెప్పుడును సత్యముమీాద ఆధారపడి యుండును. సత్యమే, అన్నిఉదారకార్యములకును పెన్నిధానము. సత్య, ధర్మాశయములను నిర్భయముతో భల్లూకపుపట్టుతో కొనసాగించుటయే పూర్ణారోగ్యమునకు మూలకీలకము.

---

# గాంధి మహాత్ముని నీతిమంజరి

## మతము.

హిందూమతము యితరుల నందరిని తన మతములోని కి లాగుకొనవలెననెడి మతము కాదు. ప్రపంచములోని మత ప్రవక్తల నందరును పూజించుట కందులో స్థానము కలదు. ఎవరిమత విశ్వాస ప్రకారము, మతధర్మ ప్రకారము, వారు దైవభక్తిని సలుపుచు యితరమతములతో పోరు లేక శాంత ముగ నుండుటయే హిందూమతాదర్శము.

/ / / / /

"లోకా స్సమస్తా స్సుఖినోభవంతు" అనుసూక్తి ననుస రించిన నిరంతరసేవయే యత్యుత్తమ ధర్మము.

/ / / / /

ఫలాసక్తి లేనిభక్తుడే నిజమైన దైవభక్తుడు.

/ / / / /

మన మే కార్యమును జేయబూనినను నీతిబద్ధులము కావలెను.

/ / / / /

స్వార్థపరుడై యితరుల యానందమునకు విముఖతను జూపునంతకాలము మానవుడు పశువుకంటె యధముడు.

తనతోడివారలహితమున కాతడెంత పాటుబడునో యంత ఉదారపురుషుడగును.

, , , , ,

సేవయందున్న మహోత్కృష్టతను గుర్తించితిమేని ధన రాసులను ప్రోగుచేయుట మహాపాపమని గ్రహింతుము. అప్పుడు ధనవంతులు నిర్ధనులు అను హెచ్చు తగ్గులు లేకపోవును. కఱవు కాటకములు లేక దేశము సుభిక్షముగ నుండును.

, , , , ,

మానవుడు ఆత్మావలోకనము చేసుకొనుటయే తన ధర్మము. తనను తాను తెలిసికొని తనశరీర మానసిక ఆత్మాభివృద్ధుల కెంతమాత్రము తడవుసేయక కృషిసలుపవలెను.

, , , , ,

ఈప్రపంచములో మనమెట్టి కష్టములకు లోనైనను సత్య, ధర్మములలోనే మనము సదా ఆనందమును చూరగొనవలెను.

, , , , ,

ఆహారవస్త్రములకంటె సుకృతములే మనకెక్కువ. ఆకలిగ నున్నపుడు తిండినిచ్చువానికంటె ధర్మకార్యములకు సమయముల కల్పించువాడే గౌరవించదగినవాడు.

, , , , ,

మంచిచేయవలెనను కోరిక, తచ్ఛక్తి బాహ్యమునుండి రాజాలదు. అ దెప్పుడు మనలోనే యుండును. మనము దానికి తగు దోహదమునుజేసి పెంపొందించవలెను.

, , , , ,

మనకోరికలను, మనభోగములను మితిమీరినట్లు పెంచుకొనుట మననాగరికతకు మనవిజ్ఞానమునకు మన స్వరాజ్యమునకు వ్యతిరేకము. వాటిని తగ్గించుటే త్యాగమే మనవిజ్ఞానమునకు ఆయువుపట్టు.

/ / / / /

మనోవాక్కాయకర్మలను వ్యభిచరించని నియమములతో సలుపుచుండుటయే యాత్మపరిపూర్ణత్వమునకు మార్గము.

/ / / / /

మోసము, అసిశ్వాసము యీ యుగధర్మములై యున్నవి. ఏమతమునకు చెందిన మనుష్యులైననుసరే బాహ్యావేషములనే మన్నించుచు మూలసిద్ధాంతములను తుంగలో నూరత్రొక్కుచున్నారు.

/ / / / /

దేశభక్తి నామతములో నొక భాగము. దేశభక్తి లేని మానవుడు పూర్ణమైన మతాభిమానమును కలిగి యుండ నేరడు.

/ / / / /

మన మతమును పాటించుటలో మన భార్యాపుత్రులను విడిచిపెట్టవలసి వచ్చినను అందులో కఠోర మేమియును లేదు. అట్లుచేయుటయే ధర్మమని నా యభిప్రాయము.

# గాంధిమహాత్ముని నీతిమంజరి.

## సంఘసంస్కరణ

మానవప్రకృతిలోనే వర్ణాశ్రమధర్మము లున్నవని నా యభిప్రాయము. హిందూమతము దానిని శాస్త్రముఖముగ నంగీకరించెను.

' ' ' ' '

ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ యనుకొనుట మన మత విరుద్ధము. భగవత్సృష్టిలోని ప్రతిజీవరాసికిని సేవజేయుటకే మనము కల్పింపబడితిమి. జ్ఞానముతో బ్రాహ్మణుడు, రక్షణ శక్తిచే క్షత్రియుడు, కృష్యాదులచే వైశ్యుడు, దైహికసేవచే శూద్రులు యీవిధముగా వీరందరు సృష్టియొక్క సేవకులు.

' ' ' ' '

నేను ఆపాదమస్తకపర్యంతము సంఘసంస్కరణవాదినే. కాని నాసంఘసంస్కరావేశము హిందూమతములోని ప్రధాన సిద్ధాంతములనే తెగనరకుటకు నన్నెప్పుడును ప్రోత్సహింపదు.

' ' ' ' '

నేను మతముయొక్క బాహ్యకర్మలను పట్టుకు వ్రేలాడు వాడను కాను. మతముపేర జరుగు యన్యాయములను సమర్థింపజాలను. దయా, సత్య, శౌచ, బ్రహ్మచర్యల నెవరు సంపూర్ణముగ తమ జీవితములో జూపజాలరో ఎవరు తమసర్వస్వమును పరిత్యజించరో వారు శాస్త్రముల నెన్నడును నిజముగా గ్రహించజాలరను యార్యోక్తియందు నాకు ప్రబల విశ్వాసము కలదు.

ı ı ı ı ı

## అ

అమాత్య శేఖరుడైన ప్రధానమంత్రి తన మాటలను తానే పాటింపకుండునుగాక! కాని తనజాతి తరపున గైకొనబడిన శపథమును భంగము చేయుట కాతని కెంతమాత్రమును హక్కు లేదు.

ı ı ı ı ı

అద్భుతమైన పరస్పర సహాయశక్తిని నిర్మాణదక్షతను సంపాదించగల మహోద్యమమును సమబుద్ధితో జూచి తోడ్పడుటకుమారుగ దానిని పరమ ద్వేషముతో ప్రతిఘటించుచు ప్రజాద్రవ్యమును వృథావ్యయము చేయుచుండుటే మన ప్రభుత్వముయొక్క అనర్హతను శతవిధముల చాటుచున్నది.

ı ı ı ı ı

అదేమి పాపమో గాని మనము 'కాదని' జెప్పుటకు కూడ శక్తిని గోల్పోతిమి. ప్రభుత్వముకు 'కాదని' చెప్పుట రాజద్రోహమే గాక మహాపాతకముగ గూడ పరిగణింపబడు చున్నది.

ı ı ı ı ı

అన్ని దేశముల విజ్ఞానశంఖములను సర్వదా నాయింట స్వేచ్ఛగా పూరింపవలెననియే నాకోరిక.

ı ı ı ı ı

అసహాయోద్యమ మన ఆత్మపరిశోధనయే కానిచో నది దోషయుక్తమై నీతిబాహ్యమైన యేహ్యపదము.

ı ı ı ı ı

అధర్మ ప్రభుత్వముక్రింద ధనమును అధికారమును గడించుట పాతకమగును. అట్టిచోట దారిద్ర్యమె సుగుణము.

ı ı ı ı ı

అత్యవసరమై యాచరణీయమైన స్వదేశీదీక్షను కొనసాగించుటలో తగినశిక్షను చాకచక్యమును, కార్యనిర్వహణ శక్తిని, మనవారు చూపించిన యెడల శాసనోల్లంఘనమును జయప్రదముగ సురక్షితముగ నడుపవచ్చును.

ı ı ı ı ı

అసహాయవాది యెంతటి దురాగ్రహప్రోత్సాహము నైనను సహింపవలెను. ఒకప్పుడు సోల్జర్లు ఈజిప్టులోని మసీ

దులో ప్రవేశించి యచ్చట జరుగుచున్న జాతీయప్రచారము ను ప్రతిఘటించ నెంచిరి. ఒకయువకుడు ఉపన్యసించుచుం డగా సభ్యులందరును వినుచుండిరి. అతడు తనప్రచారము నెంతమాత్రము చాలింపకయుండగా సోల్జరు లాతనిని పేల్చి చంపిరి. ఆసభలో ఎట్టి కలవరమును కలుగలేదు.

, , , , ,

✓ అహింసతో సత్యమును చేర్చితివేని ప్రపంచకము నంతటిని నీపాదముకడకు తెచ్చుకొనెదవు.
[illegible]
[illegible]

అన్నవస్త్రములు రెండును సంబంధించినంతవరకు భారతదేశము తనపై ఆధారపడిననేగాని యామెకు ఆర్థిక స్వాతంత్ర్య మెన్నటికిని చేకూరనేరదు.

, , , , ,

అగ్నివర్ష మంబైనను సత్యమునే పలుకవలెను. సన్నీలతో పొడుచుచున్నను సత్యపథమును వీడరాదు. స్వాతంత్ర్యస్త్రీపురుషులవలె మనము జీవింపజాలనిచో చచ్చుటకైనను సంతోషముతో నంగీకరింపవలెను.

, , , , ,

ఆత్మపారిశుద్ధ్యమే నీమోక్షమార్గము.

, , , , ,

అస్పృశ్యతకు స్థానమిచ్చి హిందూమతము పాపమున కొడిగట్టినది. అది మనలను పతితులను గావించెను. దాని ఫలితముగా సామ్రాజ్యములో మనమే పంచములమైపోతిమి.

॥ ॥ ॥ ॥ ॥

అధర్మమును, అసత్యమును, దౌర్జన్యమును, రూపు మాపి స్వరాజ్యమును స్థాపించుటయే అసహాయోద్యమము యొక్క ముఖ్యసూత్రము.

॥ ॥ ॥ ॥ ॥

## ఆ

ఆయనంతశక్తుని సింహాసనముమ్రోల నిలచినపుడు మన మేమితింటిమో, మన మెవరిచే స్పృశింపబడితిమో యనుప్రశ్నకు కాదు మనము జవాబుచెప్పవలసినది. మన మెవరిని సేవించితిమి? ఎటులసేవించితిమి? అను యగ్ని పరీక్షయే మన కొసంగబడును.

॥ ॥ ॥ ॥ ॥

ఆచరణశూన్యమైన వాచకాదర్శగ్రహణము శవాలంకారమువంటిది. అది పైకిజూచుట కందముగా నుండవచ్చును. కాని యది రసవిహీనమైనపిప్పి. అదెట్టి ప్రబోధమును కలిగింపజాలదు.

॥ ॥ ॥ ॥ ॥

ఆంగ్లభాషతో విద్యనుగరపుట మనకొంప ముంచినది. అది బుద్ధి జాడ్యమును కలిగించెను. విద్యార్థులనాడిముండల మునకు తగని భారము వారిపైనెత్తి వారిని కృంగదీసెను. అది వారిని పుస్తకములను తిను పురుగులవలెను కోతులవలె ననుకరించు వారినిగను తయారు చేసెను. స్వభావమైన ఆలోచనాశక్తిని కార్యధురీణతా సంపత్తును నాశనము జేసెను. చివరకు తనకు దెలిసినవిద్యను తన కుటుంబమునకు గాని ప్రజలకుగాని బోధించుటకు అనర్హులనుగ గూడ తయారు జేసెను. యింతే కాదు. విదేశ భాషతో విద్య గరపుటచే స్వదేశములోనే మనవారందరు విదేశీయులై పోయిరి. ఇదియే ప్రస్తుత ప్రభుత్వముయొక్క మరపునకు రాని మహావిషాదాంతనాటకము.

' ' ' ' '

ఆంగ్లేయులతో స్నేహప్రవృత్తితో నుండుటకు అంగీకరించెదము. కాని ఆస్నేహము, సిద్ధాంతములలోను ఆచరణలోనుకూడ సరిసమానుల ప్రవృత్తితో నుండవలయును.

' ' ' ' '

ఆపన్నుడగు యొక్కదీనుని సేవించినను భగవద్దృష్టిలో మన మాదరణపాత్రులమే యగుదుము.

' ' ' ' '

౩

ఇతరజాతీయకార్యక్రమ మంతయు మారిన మారును గాక ! ప్రస్తుతరూపములోనున్న స్వదేశీవ్రతము మాత్ర మెన్నటికిని దేశదారిద్ర్యము పోవలెనన్న యట్లే యుండితీర వలెను.

। । । । ।

ఇప్పుడు జరుగుచున్న పోరాటము మతమునకును విమతమునకును. అంధకారమునకును జ్యోతిస్వరూపమునకును యని యెరుంగుదురుగాక !

। । । । ।

ఇతరుల నుద్ధరించుటకు పూర్వము నిన్ను నీవుద్ధరించుకొనజాలవేని వాని నుద్ధరింపలేవు సరిగదా నీవును వానితో పాటే అధోగతిని పొందుదువు.

। । । । ।

ఇతరులయెడ ఆలోచనలేక దయాశూన్యముగా మాట్లాడుప్రతిమాటకున్ను, చేయుకార్యమునకున్ను మనము క్షమాపణ కోరవలసియున్నది.

। । । । ।

ఈ

ఈశ్వరుడు మానవుని తనభుక్తికొఱకు కష్టపడమని ఉద్దేశించి పుట్టించినాడు. ఆవిధముగా ఎవరు పనిచేయకుండా భోజనము చేయుచుందురో వారు దొంగలు.

ఉ

ఉద్రేకింపబడిన ప్రజల దురారాధ్యమైన కోపానలము ఆంగ్లేయులపైగాక వారు పాలించుచున్న ప్రభుత్వపద్ధతి పైకి ప్రసరింపజేసినందుకు యసహాయవాదు లెంతయు వందనీయులు; యాశీర్వాదార్హులు.

ఎ

ఏ కొంతమందైనను తామింతవరకు శిరసావహించుచున్న ప్రభుత్వమును నిరాకరించినచో దాదాపు తమ స్వరాజ్యమును నిర్మించుకొనినవారే యగుదురు.

ఎచ్చట ప్రేమ వెలుంగునో యచ్చట జీవితము స్ఫురించును. ద్వేషము వినాశకారణము.

౹ ౹ ౹ ౹ ౹

ఎట్టియుపద్రవములనైనను ధిక్కరించుటకు మనము సాధనోపేతులమై యుండవలెను. అట్టివాటికి వణకు జనించవలసిన పని లేదు.

౹ ౹ ౹ ౹ ౹

ఎప్పుడు భారతదేశ బాలబాలిక లందరు ప్రభుత్వ పాఠశాలల నొక్కసారిగ విడిచెదరో ఆరోజే మన దిగ్విజయ దినము మనజాతీయభావములో నదియొక గొప్ప పరివర్తనము సూచించును.

౹ ౹ ౹ ౹ ౹

ఎవరికిని యపరాధమును కలిగించనక్కర లేకుండ గోవునుచంపుటకు వీలున్నచోటే దానికంటె గొర్రెను చంపుట మేలుగా భావించబడుచున్నది. అట్టిచో ననేకమంది చే మహాపాతకముగ భావింపబడుచున్నచోట మహామ్మదీయమతగ్రంథముగాని తదితరమహమ్మదీయ ప్రపంచమందలి ఆచారముగాని విధించనప్పుడు భారతదేశములో గోవు నేల చంపవలెను ?

౹ ౹ ౹ ౹ ౹

ఏవిజ్ఞానములోనుకూడ మనవిజ్ఞానమువ నున్నన్నియమూల్యమణులు లేవు.

౹ ౹ ౹ ౹ ౹

ఎట్టి దైహికబాధమైనను మనలను స్వమతమునుండి దొలగింపకూడదు.

' ' ' ' '

ఏ ప్రభుత్వము ప్రజాపాలనలో తక్కువ జోక్యమును కలిగించుకొనునో అనగా ప్రజలకే ఎక్కువ స్వేచ్ఛ నొసంగునో అదియే శ్రేష్ఠమైన ప్రభుత్వము.

' ' ' ' '

ఎట్టి నిరంకుశ ప్రభుత్వమైనను పాలితుల యామోదము లేనిదే నిలువజాలదు. ఆ యామోదమైనను సాధారణముగా ప్రభుత్వముయొక్క బలవంతముచేతనే యేర్పడును గాని కేవల ఐచ్ఛికము కాదు. ప్రభుత్వముయొక్క దౌర్జన్యమును నిర్భయముగా నొక్కసారి పాలితు లెదుర్కొందు రేని ఆనిమిషముతో ప్రభుత్వముపని సున్నయగును.

' ' ' ' '

ఎవరు సత్యము నేరీతిగా పాటింతురో వారు తత్ఫలితమును తప్పక పొందగలరు. కాని సత్య వేషమును ధరించువారు విఫల మనోరథు లగుదురు.

' ' ' ' '

ఒ

ఒక దురాచారమునుండి తొలగించుటకు మనమేవ్యక్తినిగాని గర్హించుట శాస్త్రసమ్మతమే. అట్టివాని సంపర్కమునుండి శ్రోత్రియులను కాపాడుట యుక్తము.

' ' ' ' '

ఒంటె సూదిబెజ్జమున ప్రవేశింపవచ్చును. గాని ధని కుడుమాత్రము మోక్షమును బడయుట దుర్లభము.

ι ι ι ι ι

ఒకరహస్య మొకరహస్యము! చప్పుడు చేయకుడు; యిటుజూడుడు; మనదోపిడీ పంఘిశేవి కొంచెము పెద్దదిచే యుదము. అందులో మిమ్ముకూడ గలుపుకొనెదము. అప్పు డు మన మందరమును కలసి ప్రజలనుదోచుకొని పంచుకొనె దము. సంస్కరణలపేరుతో పిలువబడున విపయే.

ι ι ι ι ι

ఒకజాతి మరొకజాతి కెన్నడును స్వరాజ్యము లొసగ జాలదు అది యాజాతియొక్క యోధాగ్రేసరుల రుధిర ప్రవాహముచే సాధించవలసిన యమూల్య నిక్షేపము.

ι ι ι ι ι

ఒక్క స్వదేశీప్రచారము ప్రచండముగా కొనసాగింప బడునేని ఆప్రచారమే ప్రాముఖ్యమైనదిగను, సురక్షితమైన దిగను, నిశ్చితమైనదిగను యుండును.

ι ι ι ι ι

## క

మనము కోర్టులలో నొందు జయము అపజయమే. అట్టి యపజయము మృత్యుసదృశము.

ι ι ι ι ι

క్రమశిక్ష, స్వార్థత్యాగము, అప్రతిహతేచ్ఛ, వినయము- యివి లేకుండ మనకు సంపూర్ణజయ మెన్నటికిని కలుగదు. పైగా ఆగుణములను సంపాదించుటకు యుపవసించుట, ప్రార్థన పలుకుట యీ రెండే యకుంఠితోపాయములు.

, , , , ,

కోర్టులను విడని న్యాయవాదులకు హృదయ మున్నదిగాని శరీర దౌర్బల్యము వెనుకకు లాగుచున్నది. కనుక పరిపూర్ణమైన ముందు వెనుక తెలుగని త్యాగయజ్ఞమును కోరు మన యుద్యమమును వారు క్షీణింపజేయగలరు గాని పెంచజాలరు.

, , , , ,

కష్టముల ననుభవింప గలశక్తిని మనము చూపితిమి. కాని మనమింకను యనుభవింపవలసిన దెంతయో కలదు.

, , , , ,



౧

గుడినిప్రమింగినవానికి గుడిలోని లింగమొంత? మృత్యుభయము లేనివానికి జైలుభయమెక్కడ. మృత్యుభయముతో కృంగిపోయిన దేశము స్వరాజ్యమును సంపాదించ నేరదు. సంపాదించినను దానిని నిలుపుకొనజాలదు.

, , , , ,

గృహపరిశ్రమలు లేనిచో హైందవరైతులు నశించెదరు. భూమినుంచి సంపాదించుకొన్న దానితో జీవించుట కష్టతరము. వారికి మరొకచేతిపరిశ్రమ అత్యవసరమైయున్నది. రాట్నపరిశ్రమయె సులభమైనదిగను చౌకయైనదిగను మంచిదైనదిగను యున్నది.

॥ ॥ ॥ ॥ ॥

గవర్నమెంటువారు అయోగ్యపుపనులను, బెదరింపులను, ప్రోత్సాహపరచునప్పుడు న్యాయాధిపతులు, కార్యనిర్వాహకులు, తదితర ఉద్యోగీయులు వారికే పనిముట్లవలె తోడగుచుందురు.

॥ ॥ ॥ ॥ ॥

## జ

జాతీయప్రబోధమునుగాంచి, తమ హక్కులకొరకు సర్వస్వమును ధారవోయ సమకట్టిన ప్రజల యాశయములను అల్లిబొల్లికబుర్లను టక్కు టమారి విద్యలును మోసపుచ్చగలవా.

॥ ॥ ॥ ॥ ॥

జాతి సమితియొక్క కడసందేశము క్ర్యారాసి సంఘాతముగాక జాతులనుండి బహిష్కరించుటయే యనగా అసహాయోద్యమమేయని పాశ్చాత్యు లిప్పుడు గ్రహించుచున్నారు.

॥ ॥ ॥ ॥ ॥

## త

తమ యధికారులచేత ప్రజలపై గావింపబడిన దుర్న్యయ దురంతముల నన్నిటిని సమర్థించు ప్రభుత్వముతో నొక్క క్షణికమైనను యెట్లు సంపర్కమును గలిగించుకొనగలము?

, , , , ,

త్యాగాగ్నిచే పునీతము కాకుండ ఏదేశమును అభ్యుదయమును గాంచలేదు.

, , , , ,

తప్పిదము చెదుగువలె రహస్యముగా ప్రబలును. అది బహిర్గత మయ్యేనేని నశించును.

, , , , ,

తమతో సరిసమానమైన ప్రవృత్తితో నుండవలెనను భారతీయుల కోరిక ఆంగ్లేయులకు వెగటుగా నుండును. శ్వేతాధిక్యత వారి కొకమతమై పోయినది.

, , , , ,

తండ్రులు పుత్రులకుగాని భర్తలు భార్యలకుగాని తమమాతృభాషలోగాక ఆంగ్లభాషలో యుత్తర ప్రత్యుత్తరముల జరుపుకొనుట యసహ్యాకరము.

, , , , ,

తన్నినకాలును, ముద్దుపెట్టుకొనుటకు తిరస్కరించుటే మనతప్పిదము. నిర్మలాంతఃకరణతో గూడిన సహాకార

మువచ్చువరకు మనము ప్రభుత్వముతో సహాయము చేయ కుండుటే మన నేరము.

। । । । ।

తమయధికారము నెంతమాత్రము మనము లక్ష్యము చేయజాలమని ప్రభుత్వము గుర్తెరుగునట్లు మనము భగీరథ ప్రయత్నములను సలుపుదుముగాక !

। । । । ।

౮

దేశమనే శరీరమునకు వ్యవసాయము, నూలువడకుట అను రెండును ఊపిరితిత్తులు. వీటికి క్షయవ్యాధి రాకుండు నట్లు ఎప్పుడును గట్టిప్రయత్నము జరుగవలెను.

। । । । ।

ధర్మముతో సహకారము, అధర్మముతో సహాయ నిరాకరణము, హిందువునకైనను, మహమ్మదీయునకైనను, క్రైస్తవునకైనను, పరిశుద్ధజీవితమును, జీవించుటకు ముఖ్యా వసరములు.

। । । । ।

దేశము క్రొత్తపన్నులను భరింపజాలదు. ఇదివరకు భరించుచున్న పన్నులే దుర్భరముగ నున్నవి.

। । । । ।

ధైర్యము, సహనము, నిర్భయత్వము, వీటినన్నిటిని మించిన స్వార్థత్యాగము, ఇవియే మన నాయకుల లక్షణములు కావలెను.

׀ ׀ ׀ ׀ ׀

దౌర్జన్యము ఆత్మహత్యయే యని ప్రతివారును గ్రహించునట్లు చేయవలెననియే నాకోరిక.

׀ ׀ ׀ ׀ ׀

దేశభక్తి యన్నను, మానవభక్తి యన్నను, ఒక్కటే. నేను మానవుడను గనుకనే దేశభక్తిని కలిగియున్నాను. అది ఎంతమాత్రము సంకుచితము గాదు. భారతదేశ సేవ జేయుటకు నేను జర్మనికిగాని ఇంగ్లండునకుగాని హానిని జేయను.

׀ ׀ ׀ ׀ ׀

దుర్బలత్వము, క్రౌర్యము, అశక్తత యీకారణములచే ఎవరినైనను పదభ్రష్టులను గావింప వలెనను సూక్తులను మనము వినమే.

׀ ׀ ׀ ׀ ׀

ధైర్యవంతుడై విశ్వాసపూరితుడైన నేతవాడుగాని, చెప్పులుకుట్టువాడుగాని విశ్వాసశూన్యమైన పిరికిన్యాయవాదికంటె యెక్కువసుగమముగ దేశమునునడుపగలడు. జయము, ధైర్య, త్యాగ, సత్య, ప్రేమ, విశ్వాసములపై నాధార

పడును. ప్లీడరుఎత్తులు, గుణకారములు, చాణక్యచతురత, ద్వేషము, అవిశ్వాసము వీటివల్ల ఏమియు లాభము లేదు.

। । । । ।

దార్జన్యరాహిత్యముయొక్కతత్త్వము నిరహంకారమే. దార్జన్యరాహిత్య మన భగవంతుని అండయే. యిదియె అన్నియుగములలోను మేరువ్రగానుండెను. భగవంతుని సహాయము కావలయు నన నమ్రతతోను వాస్తవమైన విచార మనస్సుతోను భగవంతుని చేరవలయును.

। । । । ।

దార్జన్యరాహిత్యమతము ఋషులకును, సన్యాసులకును మాత్రమే కాదు. అది జనసామాన్యమునకుచు సంబంధించినదే. పశుజాతికి దార్జన్యతత్త్వమెటువంటిదో మానవజాతికి దార్జన్యరాహిత్యతత్త్వమటువంటిదే.

। । । । ।

# న

నేడు భారతదేశము పరుల యిచ్ఛానుసారముగా యాడింపబడుచున్న మృతకళేబరము. ఆత్మసంయమనమువలన భారతదేశ మాత్మపరిశుద్ధ్యము నొందును గాక ! అపుడు తనకేగాక మానవలోకమునకు గూడ యామె కళ్యాణసంధాయికాగలదు.

। । । । ।

నీతిని తిరస్కరించుచు న్యాయమును పురికొల్పని మత విశ్వాసమును దేనినైనను నేనంగీకరించను. అనీతికరము కాకపోయినచో హేతువిరుద్ధమైన మత విశ్వాసము నైనను నేను సహింతును.

, , , , ,

నా చేతిలోనే యధికార మున్న యెడల ప్రస్తుతమున్న పాఠక పుస్తకముల నన్నిటిని యొక్కసారి చింపివేతును. నిత్య గృహ జీవితమునకు సంబంధించులాగున పుస్తకములను వ్రాయ నియమింతును. వీటిని చదువుకొని బాలుడు వెంటనే తన పరిసరముల యందు తన విద్యను ఆచరణకు దెచ్చుచుండును.

, , , , ,

నీవు విద్యార్థివిగాని, విద్యార్థినివిగాని యైనచో అర్ధ మపక్షము రోజునకు నాలుగుగంట లైనను నూలువడకకుండ మామూలు చదువు చదువుకొనుట పాప మని తలంచవలెను.

, , , , ,

నేను పునర్జన్మను కోరను. నాకు పునర్జన్మయే సంభవించునేని నే నొకపంచమునియింటపుట్టి వారి విచారములను వారి బాధలను వారిపై మోపబడుచున్న యనేక మరన్యాయములను నేనుకూడ పంచుకొందును. ఇట్లు వారిమధ్యనుండి

వారిని నన్నుగూడ యీదుర్భరస్థితినుండి రక్షించు కొనుటకు ప్రయత్నించెదను.

। । । । ।

నేను అన్నమో రామచంద్రాయని పొట్టచేత బట్టుకున్న క్షుద్బాధ పీడితులను ఖద్దరు రక్షించును. లజ్జాస్పదమైన జీవితములనుండి మరలింపబడిన వారికది త్రోవజూపును. ఖద్దరులో హృదయము కలదు. ఆత్మకలదు.

। । । । ।

నేను దుర్బలునికి అండగా జేరి నిరపాయమై నిశ్చితమై, సూటియైన కార్యకలాపము వాతనికి బోధించి యాతని కాత్మబలమును చేకూర్చి పశుబలము నెదుర్కొనుటకు శక్తివంతునిగ జేయుచున్నాను.

। । । । ।

నామట్టుకు అసహాయోద్యమము ఆపుదలకాలేదు. ప్రభుత్వము భారతదేశముపట్లను, మహమ్మదీయులపట్లను పంజాబుహత్యలనాడు గావించిన యపరాధములపట్లనో మాలిన్యమునుతొలగించుకొని ప్రజేచ్ఛానుసారముగ వారి పద్ధతిమారునంతవరకు అది యట్లేయుండును.

। । । । ।

నా సోదరునికంటె నా శత్రువైనవాడు సహితము వైరాయిపదవి నధిష్ఠించునేని నే నాతనికి వినతులొసంగ జాలను.

/ / / / /

నాకే యధికార మున్న యెడల నేను తేయాకు ఎస్టేటు లన్నిటిని నాపివేసెదను. అక్కడనున్న యూరేపియను పిల్లలను జూచినచో భారతస్త్రీ లెట్టియవమానములకు పాల గుచున్నారో తెలియగలదు.

/ / / / /

నాలో కొంచెమైనను హాస్యరసము లేకున్న నేను చాలకాలముక్రితమే ఆత్మహత్యను గావించుకొని యుందును.

/ / / / /

నా కధికార మున్నచో పాఠశాలలలో నన్నిపనులను కట్టిపెట్టించి బాలబాలికలచేత నూలును వడకించెదను.

/ / / / /

నూలుతీయు ఉపాధ్యాయులను తయారుజేసి రాటములను తయారుచేయుటకు వడ్రంగులను ప్రోత్సాహపరచెదను. ఆ ఉపాధ్యాయుల నీప్రాణదాతలగు రాటయంత్రములను ప్రతిగృహమునకు గొంపోయి యీ శిక్షణ నిచ్చునట్లుగా నియమింతును. నా కధికార మున్నచో గుప్పెడు పత్తియైనను యితరదేశములకు పోకుండజేసి ఇచ్చటనే నూలువడకించెద

ను. ఈ నూలును ప్రోగుజేసి నేతవాండ్రచేత నేయించుటకు డిపోలను పెట్టింతును. చాలినంతమంది శిక్షణనొందిన స్థిర బుద్ధు లున్నచో హిందూదేశమునుండి దారిద్ర్యమును ఒకవత్సరములోనే పారద్రోలుదును.

। । । । ।

నేను భగవంతుని సత్యములనరయజూచుచున్నాను. నాకు మనుష్యునివల్ల భయమంతయు నశించినది. కనుక నే భగవంతు డసహాయోద్యమముతో నున్నాడని నా విశ్వాసము. నేనాతని సర్వవ్యాపకత్వమును జూచుచున్నాను.

। । । । ।

నేను భారతదేశముయొక్కయు లోకముయొక్కయు సేవకుడను. అట్టి సేవయందే ప్రాణములనువిడువ నుత్సహించుచున్నాను. నేను గ్రహించినట్లు సత్యము నాచరించుట, ప్రకటించుట నావిధ్యుక్తము. నేనందుకొరకే ప్రయత్నముల జేయుచున్నాను. నే ననేకప్రాచీనసత్యములపై నూతనజ్యోతిని ప్రసరింప జేయుచుంటినని చెప్పగలను.

। । । । ।

నామగతనము నమ్ముకొని యాత్మరక్షణను కొనుట కంటె నాసర్వస్వమును నేనును కూడ నశించుటకు నే నంగీకరించెదను.

। । । । ।

నామతము కారాగారమతము కాదు. అందులో నం కుచితము లేదు. బలవంతమును లేదు. భగవత్సృష్టిలోని ప్రతి యాత్మకును నందు స్థానము గలదు.

    

నా ప్రేమయే నన్ను మీ సేవజేయుటకు పురిగొల్పు చున్నది. సంస్పృష్టిక ర్త ప్రమోల నాజీవితమును సార్థకము జేసి కొనుటకే నేను మీ కష్టములను, విచారములను, పంచుకొను చున్నాను.

    

నిజమైన దేశభక్తియుండి ధైర్యమున్నచో ద్వాన్ద్వ రాహిత్యమును మతముగా స్వీకరించక నీతిగా స్వీకరించినను నది జయింపవచ్చును.

    

నమాజు చేసినంతమాత్రము చేగాని దేవాలయము నకు పోయినంతమాత్రము చేగాని మతమునిపించుకొనదు. ఆత్మతత్త్వమును బ్రహ్మతత్త్వమును తెలిసికొనుటయే మతము. నేతనేయు కళను నేర్చుకొనినగాని నేయువాడు కాజాలనట్లు కొన్ని సూత్రములకు కట్టుపడిన గాని యాత్మతత్త్వమును తెలిసికొనజాలడు.

నిరాధారులగు లక్షలకు ప్రాణదాయి యగు చరకా ప్రయోగమే నిరాశాధూమమును పారద్రోలి ఆశాభాస్కరు నుదయింపజేయును.

 ‌ ‌ ‌ ‌ ‌

నాగరికతావ్యాజమున అస్త్రబలముతో జరుగుచున్న ప్రస్తుత వర్తకదోపిడి పద్ధతులపైనను, సహకారముకొరకు చేయుచున్న బలవంతపద్ధతిపైనను, ఒకపక్షమునకే యన్యాయముగ చేయుచున్న దోహదముపైనను మనపోరాటము జరుగుచున్నది.

 ‌ ‌ ‌ ‌ ‌

పాలు త్రాగువాడు మాతృస్తన్యము నంటి పెట్టుకొని యుండునట్లు నేనును నాభారతాంబ నాశ్లేషించి యుందును. నాకు కావలసిన యాధ్యాత్మిక సంపత్తు నంతయు నామెయే ప్రసాదింపగలదు. నామహదాశయములకు తగిన పరికరము లన్నియు నాకిచ్చుటనేగాన్పించుచున్నవి.

 ‌ ‌ ‌ ‌ ‌

పశువులలో ఆత్మ నిద్రాణమై యుండును కనుక దానికి పశుబలము తప్ప వేరొండు కానరాదు మానవత్వము దానికంటె యుత్కృష్టమైన యాత్మతత్వముపై నాధారపడి యుండును. కనుక నాత్మబలమే మనబలము.

 ‌ ‌ ‌ ‌ ‌

ప్రతిజాతికి నొకధ్వజముండవలెను. దానికొరకే లక్షో పలక్షలు చనిపోయిరి. అది యొకవిధమైన విగ్రహారాధన. అట్టిదానిని నాశనముచేయుట పాపభూయిష్ఠమై యున్నది.

' ' ' ' '

ప్రతీకారము సల్పుటగాని నిర్వీర్యతనుజూపి తలయొగ్గుటను గాని అసహాయవాది చేయజాలడు. దుర్దమనురంత ప్రభంజనుని మధ్య స్థాణువువలె చలించకయుండుటయే అతని కర్తవ్యము.

' ' ' ' '

పిరికి పందవలె రక్షణను గోరుటకంటె మేభిల్లుని బాణమునకైనను గురియగుటకే నే నంగీకరించెదను.

' ' ' ' '

ప్రపంచమంతయు కాదనినను భగవంతుడు ధర్మస్వరూపుడే. న్యాయమూర్తియే. ప్రజాబలము లేకపోయినను సత్య మద్వితీయముగా నిలుచును. అది స్వయంప్రకాశము.

' ' ' ' '

ప్రజలు మన మనుకొనునంతమూర్ఖులుగను, జ్ఞానశూన్యులుగను ఎన్నటికిని లేరు.

' ' ' ' '

ప్రాచీనసామ్రాజ్యము లన్నిటివలెనే బ్రిటిషుసామ్రాజ్యముకూడ ఒకేపాతకమును గట్టుకొనుచున్నది. దుర్బలదేశములను వర్తకదోపిడీలతో పీల్చుటే సామ్రాజ్యతత్త్వము.

' ' ' ' '

ప్రతి ఇంగ్లీషువానితో మనము యుద్ధము చేయుటలేదు. ఇంగ్లీషుజాతిని ధ్వంసముచేయవలెనని చూచుట లేదు. మానవున కుండవలసిన శరీరము, మేధ, హృదయము అనువాటినే ధ్వంసముచేసిన యీ ప్రభుత్వవిధానమును మాత్రమే ధ్వంసముచేయవలెనని మాసంకల్పము.

, , , , ,

ప్రాణకష్టమైనను సంభవించునుగాక! దేశారిష్టకార్యముల వేటినికూడ ఆమోదించజాలము.

, , , , ,

ప్రకృతిలో కావలసినంత సంఘర్షణ మున్నను ఆకర్షణము వలననే ప్రకృతి నడచుచున్నది. అన్యోన్యప్రేమయే ప్రకృతికి మూలాధారము. మానవుడు ధ్వంసము చేయుటచే జీవింపజాలడు.

, , , , ,

ప్రభుత్వముయొక్క యుద్దేశ్యమును పూర్తిగాగ్రహించిన మనము, మనధనమైనను, జలియను వాలాహత్యలచే రుధిరప్రసిక్తమైన హస్తముల నుండి స్వీకరించుట పౌరుషహీనము.

, , , , ,

ప్రతితండ్రియు తనపిల్లలకందరకును దుర్భరద్రవ్యనష్టముతో పాశ్చాత్యవిద్యను గఱపుచున్నాడు. పిల్లలందరును

ఎప్పుడో ఎన్నడో ఏమిసంపాదింతురో గాని తత్కాలములో తండ్రుల కేంతమాత్రము సహాయము జేయజాలకున్నారు. అతి దరిద్రభూయిష్ఠమైన మనదేశములోనున్న యీపద్ధతి బహు ప్రమాదకరమై యున్నది.

, , , , ,

పయోముఖవిష కుంభమువలె సైతాను చెఱగునకు కొంచెము వెరగుపెట్టి ప్రపత్తులను తనవలలో పడవేసికొనుచుండును.

, , , , ,

ప్రజల నంధకార బంధనము లో నికి దింపుచు వారికి జ్ఞానదానమును చేయుచున్నామని నటించు ప్రభుత్వపు టాటల నెంతమాత్రమును సాగనీయుట అన్యాయము.

, , , , ,

ప్రస్తుత ప్రభుత్వ పద్ధతిపై అననురాగమును పురికొల్పుట మన విద్యుక్తధర్మము.

, , , , ,

ప్రభుత్వ పాఠశాలలలో మన బాలురవమానముల పాలు చేయబడుదురు. మన దేశమును బుద్ధిపూర్వకముగ దోచుకొనిన ప్రభుత్వాధికారుల యాధిపత్యముననే యీపాఠశాలలన్నియు నడుప బడుచున్నవి. అట్టిపాఠశాలలనుండి మనబాలురను మాన్పించుటత్యవసరము. అట్టిపాఠశాల

లలో చదువుటవల్ల ఒక్కొక్కప్పుడు మనపతనవేగము నిరోధింపబడవచ్చును. కాని పాఠశాలలలో జరుగుచున్న జాతీయావమానమును భరించు టెంతమాత్రము న్యాయము గాదు.

⸝ ⸝ ⸝ ⸝ ⸝

ప్రాణముపోయుటకు శక్తిలేనిమానవుడేజీవి ప్రాణమునైనను తీయుటకు హక్కులేదు.

⸝ ⸝ ⸝ ⸝ ⸝

పరిజలలో సత్యాగ్రహము స్థానము నేర్పరచు కొనినది. దౌర్జన్య, అక్రిమ, శక్తులప్పుడే దాని ధాటీముందు వడవడ వణకుచున్నవి.

⸝ ⸝ ⸝ ⸝ ⸝

ప్రభుభక్తి యచలమగు సిద్ధాంతముగాదు. అది పరస్పరాంగీకారము. ప్రజలయెడల భక్తితాత్పర్యములను కనుపరచు ప్రభుత్వము వారినుండి ప్రభుభక్తిని చూరగొనును.

⸝ ⸝ ⸝ ⸝ ⸝

పవిత్రత జీవితమున కెంతప్రాణాధారమో కార్యనిర్వాహణముపట్లకూడ అంతప్రాముఖ్యమే.

⸝ ⸝ ⸝ ⸝ ⸝

ప్రజాభిప్రాయమే సంఘపవిత్రతను, యారోగ్యమును కాపాడగలదు.

⸝ ⸝ ⸝ ⸝ ⸝

భగవద్భక్తుల యొక్కయు అకలంకాత్ములయొక్కయు నిష్కారణబాధయె ఫలించునుగాని ఉక్కుమాకగోలవల్ల, గుండరగోళమువల్ల ఇసుమంతయు లాభము లేదు.

| | | | |

భారతాత్మ అవినాశి. భారతదేశమున కెంతశరీరదౌర్బల్యము వాటిల్లినను మొంత ముప్పుసంభవించినను తదాత్మ జయజయ ధ్వానములతో విజృంభించుచునే యుండును.

| | | | |

బాసినను యజమానిగృహమంతయు జయిలే యగునట్లు నాకు భారతదేశమంతయు పెద్ద జయిలువలెనున్నది.

| | | | |

భారతయోధుల నాంగ్లప్రభుత్వము మానవకళ్యాణమునకు వినియోగించిన పాప మొకహరియైన కట్టుకొని యుండలేదు.

| | | | |

భేదకల్పనల జేసి పాలించు నీతిపై బ్రిటిషుప్రభుత్వమాధారపడి యున్నదని నిష్పాక్షికముగ యొప్పుకొనిన హ్యూము దొరగారి వాక్యములను నే నెన్నటికి మరువజాలను.

| | | | |

భగవత్కింకరుల నేవ్యక్తిగాని, ఏప్రభుత్వము గాని తమ సేవకులనుగా చేసికొనుట కెట్టి యధికారమును లేదు.

। । । । ।

భగవంతుని యంత్యపరీక్ష అతికఠినమైనది. సైతాను యంత్యభ్రమ అతి సమ్మోహనకరము. స్వతంత్రము నొందుటకు మనము భగవంతుని యంత్యపరీక్షకు తాళవలెను. సైతాను యంత్యభ్రమకు లోనుగాకుండ నుండవలెను.

। । । । ।

భారతదేశము తన స్వాతంత్ర్యమును గురించి యాలోచించుటకు పూర్వము తన ఆర్థికస్వాతంత్ర్యమును చేకూర్చుకొనవలెను.

। । । । ।

బ్రాహ్మణులను జయించుటకు తన ప్రేమామృతవృష్టి చాలియుండనిచో త్రిప్రయత్నమున బుద్ధుడు తన ప్రాణములనే యర్పించియుండును. మహాసామ్రాజ్యమును ధిక్కరించి జీసను కంటకకిరీటన్యస్తమస్తకుడై యురికొయ్యపై ప్రాణములను వీడెను. నేనును జీసను క్రైస్తు మొదలగు మహావక్తల పథము ననుసరించి దార్జన్య రాహిత్యపద్ధతిపై నిరోధమును బూనితిని.

। । । । ।

భారతదేశములో స్వేచ్ఛా మానవునివలె చనిపోవు టకన్న ఘనతర మేమి?

। । । । ।

బ్రిటిషుప్రభుత్వము భారతదేశమునకు గావించిన యత్యాచారపరంపర లన్నియు భారతప్రజాహృదయాంతరా శమున నిప్పువు ప్రధూమితాగ్నివలె యున్నవి. ఆయగ్ని స్వార్థత్యాగము, జాతీయైక్యతారూపములను దాల్చి ప్రభు త్వము తమ పశ్చాత్తాపమును వెలిబుచ్చి హృదయపరివర్తన మును గావించుకొనుటో లేక దేశమును విడిపోవుటో చేయు వరకును విడిచిపెట్టదని నాదృఢవిశ్వాసము.

। । । । ।

భోజన ప్రతిభోజనములు, అంతర్వివాహములు మన పోరాటములను ఐకమత్యము లేకపోవుటను ఇంకను అనేక యనర్థములను యెప్పుడును మాన్పియుండ లేదు.

। । । । ।

బూతుపాటలను, అసాచ్య సంభాషణలను వినుట బ్రహ్మచర్యమునకు భంగ మొనర్చును. భగవన్నామకీర్తన మొనర్చుటకుబదులు బూతుమాటలాడుట జిహ్వా వ్యభిచార మగును. అట్లే ఇతరయింద్రియములకును వ్యభిచారదోషము కలుగుచుండును. ఇంద్రియ నిగ్రహమున్నవాడే నిజమైనమా నవుడు. మనము గుట్టమును స్వాధీనముంచుకొన లేక పడి

పోవు గుఱ్ఱపురౌతువలె నున్నారము. కళ్ళెముచే దానిని స్వాధీనము చేసికొనగలరౌతు పడజాలడు. ఇంద్రియ నిగ్రహమున్న మానవుడు ధన్యుడగును.

। । । । ।

బలము శరీరదారుఢ్యముచే నేర్పడజాలదు. అప్రతిహతమైన యిచ్ఛాశక్తియే బలము నొసంగును

। । । । ।

బలంపతులు శక్తివంతులు యనేక తప్పిదములనే కాక యున్మాదకార్యములను కూడ చేయుచుందురు. వారి క్రియలకు మనము ప్రతిక్రియ యొనర్పక ఐచ్ఛికముగ గౌరవయుతముగ శాంతముగ వాని ననుభవించినపుడే మనకు జయము కలుగును. కాని యపరాధముల గావించు ప్రభుత్వేచ్ఛకు మాత్రము లొంగరాదు.

। । । । ।

బాధలోను కష్టములోను తప్తమై జాతులు పుట్టుచుండును.

। । । । ।

బహిరంగముగ గాని అంతరంగముగ గాని దౌర్జన్యమును పురికొల్ప నంతవరకు ఉరిస్తంభమునకు కొంపోబడినను మన నిశ్చితాభిప్రాయములను మనము ఖండితముగ బహిర్గతము చేయవలెను.

। । । । ।

బలవంతము ఎట్టిరూపములో నున్ననుసరే మనపోరా టమునందు విసర్జనీయమే యగును.

। । । । ।

భారతీయ శాంతిని తొలగించుటకు తన్మూలకారణము ల నివారింపవలెనే కాని తేనెపూసిన కత్తులవంటి ఉద్యోగ ములతోను చిన్నచిన్న హక్కులతోను దానిని కప్పి పుచ్చ చూచుట దుస్సాధ్యము.

। । । । ।

## మ

మనకు స్వరాజ్యమును ప్రసాదించుటకు బ్రహ్మకైనను తరముగాదని చెప్పుటకు నేను వెరువను. మనమే దానిని సాధించుకొనవలెను.

। । । । ।

మన కొసంగబడిన సంస్కారాదికములు మనబుద్ధి నాశనమునకు వేయబడిన వల్లమందుమాత్రలు.

। । । । ।

మనముచేసిన ప్రమాణికమును లేదని త్రోసివేసి భగ వంతునియెడల పాపకర్ముల మగుటకంటె దుర్బలులము పిరికి పందలము అనుదోషము నంగీకరించుట బహుశ్రేయస్కర్రము.

## గాంధి మహాత్ముని నీతిమంజరి.

నీవు నీ నిజాత్మక సత్యవంతుడ వగుటకంటె ప్రపంచమున కసత్యవంతుడ వగుట అనేకలక్షలరెట్లు మంచిది.

। । । । ।

మనము అసహాయుల మని భావించుకొనుచుండుట చేతనే స్వరాజ్య సంపాదన వెనుకాడుచున్నది. ఆత్మవిశ్వాస మును పూనినతత్క్షణమే మనకు స్వరాజ్యము చేకూరును.

। । । । ।

మనము తిండి, గాలి లేకుండ జీవించజాలనట్లు చేతి వడకు పరిశ్రమ లేకుండ యీప్రాచీనభారతమునుండి దారిద్ర్య మును పారగనంపుటయును, ఆర్థిక స్వాతంత్ర్యమును సంపాదిం చుటయును బహుదుర్లభము. ప్రతియింటపొయ్యి యెంతటి అవసరమో రాటముకూడ యంతప్రాముఖ్యము.

। । । । ।

మానవుడుగావించిన యపచారములన్నింటిలోను స్త్రీ లయెడల చేసిన యపచారమంత పశుప్రాయమైనది, అమా నుషమైనది, పతనహేతువైనది వేరొండు గానరాదు. నాదృ ష్టిలో స్త్రీలు దుర్బలులుగారు. పురుషులకన్న స్త్రీ లేయుదా రచరితలు. నేటికిని వారేత్యాగమూర్తులు. విశ్వాసము, సౌజన్యత, రెండవకంటివా డెరుగని బాధననుభవించుట, జ్ఞానము, వారియందు మూర్తీభవించెను.

। । । । ।

మనము సీమగుడ్డల నెంతధనముతో గొనుచుందుమో మన నేతవానికి, వడుకువానికి, నంత ధనము లేకుండ జేసిన వార మగుదము. పైగా వానికింకొక వృత్తినైనను జూపని పాపమును కట్టుకొనుచున్నారము.

, , , , ,

ప్రస్తుత ప్రభుత్వపద్ధతి యేదైనను మంచిచేసెనేమో యని మూచితిని. కాని మందునకైనను యొక్క మంచి కార్యముకూడ నాకు కానరాకపోయెను. ప్రస్తుతప్రభుత్వపద్ధతితో యిప్పుడున్న విద్యార్థులసంఖ్య యొక అర్ధశతాబ్దములోనైనను రెట్టింపుకానేరదు.

, , , , ,

మన యిరుగుపొరుగువారి దోషములను మనము మన్నింతుమేని మన యితరసహాయ మేదియు యక్కరలేకుండగనే ప్రపంచము బాగుపడగలదు.

, , , , ,

మనప్రజలకు స్వాతంత్ర్యమునుకోరుట పాపమగునేని నేను మహాపాపిని. క్షమార్హముగాని పాపమును చేసినవాడను. అంతేకాదు. పశ్చాత్తాపమునకు మించిన పాపమును కూడ చేసినవాడనే. ఈ మహాపాపములనుచేసినందులకు నే నానందించుచున్నాను. భారతీయులను అధమగతికి తెచ్చి మరుగుజ్జులనుగా తయారుచేసిన విదేశప్రభుత్వ దాస్యము

నొక్కసారిగా ఛేదించవలెనని నేను బోధించుట యపరాధమగునేని నే నట్టి మహాపరాధిని. భగవంతుడు నాకట్టి మహాపరాధమును చేయుట కొసంగిన ధైర్యమునకును మగతనమునకును నేను గర్వించుచున్నాను.

‘ ‘ ‘ ‘ ‘

ముప్పదికోట్ల భారతీయులు తమ నిజసత్వమునొక్కసారి గుర్తించిన చాలును. వారు దాని నుపయోగించనక్కర లేకుండగనే స్వేచ్ఛనొందగలరు

‘ ‘ ‘ ‘ ‘

మూడు ముఖ్యవిషయములను సర్వజనులు పాటించుట న్యాయము. ఒకటి సత్యసంధత రెండవది అన్యులను హింసించకుండుట. మూడవది ఇంద్రియములను జయించుట.

‘ ‘ ‘ ‘ ‘

మృత్యువను తలగడపై నేజాతి తల నిడుకొని నిద్రించునో నదియే యమోఘజాతి.

‘ ‘ ‘ ‘ ‘

## య

యూరపు నేడు భగవచ్ఛక్తిని జీససుశక్తిని గాక సైతానుశక్తినే ప్రదర్శించుచున్నదని నా నిశ్చితాభిప్రాయము. పైకి భగవద్వేషమునే వేసినపు డిక సైతాను ప్రభ దుర్నిరీక్ష్యముగదా!

‘ ‘ ‘ ‘ ‘

యుద్ధశాసన పరిపాలన కుత్తరవాదియైన ప్రభుత్వము, అందలి దౌర్జన్యములకు, ప్రజాభయ విహ్వలతకు నుత్తరవాదియైన ప్రభుత్వము తాము గావించిన ప్రమాణికములకు వ్యతిరేకముగా రహస్య సంధులను గావించిన ప్రభుత్వము, దైవశూన్య ప్రభుత్వము గాక మరేమగును.

। । । । ।

యెంతటి మహామహులైనను తానెంత యౌన్నత్యమును పొందగలడో యంతను పొందుటకు తగు సావకాశములనన్నిటిని ఇంగ్లీషువారు లాగిపార వేసినప్పుడు మన దేశమునకు స్వాతంత్ర్యము వారిక్రింద యెన్నడును సంభవించదని నాయభిప్రాయము. అందుచేతనే మనలో యనేకమంది మన నిజసత్త్వానుమరచి ఇంగ్లీషువారి క్రింద మనమెంతకాలమో తగుశిక్షను పొందినగాని స్వపరిపాలన కర్హులముకామను వెఱ్ఱిభ్రమలో పడియున్నారు. నేడే మనము స్వపరిపాలనకు పూర్తిగ తగియున్నారమని నాప్రబల విశ్వాసము.

। । । । ।

యెంతటి నిరంకుశప్రభువైనను తనచేతబడినవానిసహాయమును బలవంతముగనైనను లాగికొననిదే సఫలమనోరథుడు కాజాలడు.

। । । । ।

ర

రణరంగములో మృత్యువుమోక్షప్రదము. జయిలు స్వాతంత్ర్య కవాటము.

‌ ‌ ‌ ‌ ‌

దుర్బలునికి బలము చేకూర్చవలెనన్న ప్రేమంతవస రమే. కాని యవిశ్వాసకుని బలవంతముగ ప్రేమచే విధేయుని జేసికొనుట రాక్షసకృత్యము. తాత్పర్య మెరుగని మంత్రో చ్చారణ రసవిహీనము; నిరర్థకము. టాగూరుకవి యవిశ్వా సకులందరిని చరకామతమను గ్రుడ్డిగయామోదించక తిరుగు బాటుచేయుమను టెంతయుసమంజసము.

‌ ‌ ‌ ‌ ‌

రష్యాను విడిచి ప్రపంచజాతులలో ఏ మూడుజాతు లలోగాని తయారైనంత మంది కంటె యెక్కువయోధాగ్రే సరులను నొక నూరువత్సరముల క్రితము మనభారత పుణ్య భూమిలో తయారైనస్థితిని చూడుడు! నేటి దార్భాగ్యావస్థ ను పరికింపుడు! ఏజాతికిగాని యింతకన్న యవినీతికరమై, యంధకారబంధురమైన స్థితి వేరొకటి యుండజాలదు.

## ల

లక్షలకొలది గృహములకు సమానముగ ధనమును, పనిని మన మూహించగలిగినంత సులభ సాధ్యముగ పంచి పెట్టగలశక్తి రాటచక్రమునకే గలదు.

। । । । ।

వివేకదృష్టితో చూచితిమేని శాసనసభా బహిష్కార వాదులు తాము శాసనసభలలో నుండుచో పాడివివేయు దానికంటె యుత్కృష్టమైనసేవను పెచుండియే చేయుచు న్నారు.

। । । । ।

విదేశవర్తక దోపిడీదారులకు సేవజేయుటకే మనదేశ ములోని చట్టము లుపయోగింపబడుచున్నవి.

। । । । ।

విదేశవస్త్ర సమ్మోహము పారతంత్ర్యమును, దారాభ్గ్యమును, పీటికంటె వేయిమడుంగు లధమాధమమైన పాతివ్రత్యభంగమును అనేక గృహములకు తెచ్చిపెట్టెను.

। । । । ।

## వ

వాచాభిమానములో ఎంతఅర్థమున్నను, ఎంత ఆత్మ విశ్వాసమున్నను, అదియంతయు నిరర్థకమైనదే.

। । । । ।

విశాలమైన యీభారత దేశమందు ఎంతమంది యోగ్యులున్నారో అన్నిపక్షములకుకూడ తావుగలదు.

' ' ' ' '

సూక్ష్మదృష్టితో చూచితిమేని ప్రస్తుతప్రభుత్వము మన దౌర్బల్యముమీదనే ఆధారపడియున్నదని గ్రహింపగలుగుదుము.

' ' ' ' '

విదేశవస్త్రము, విదేశపునూలు నేడు మన దేశములో రూపుమాసినచో మన భారతపుణ్యభూమిలో ప్రాచీనకాలపు డక్కామస్లినులు మొదలగు చీనిచీనాంబరములు తయారగు శక్తి కెట్టియాటంకములును యుండజాలవు.

' ' ' ' '

వృథా వాదోపవాదములు గాక నిరపరాధుల బాధయే శిక్షించువారిని శిక్షనొందువారినిగూడ తరింపజేయును.

' ' ' ' '

వేయిసారులు దౌర్జన్యమునైనను నేనొప్పుకుందునుగాని యొకజాతియంతయు నిర్వీర్యమగుటను సహింపజాలను.

' ' ' ' '

విషమిశ్రితమైన దుగ్ధమును గ్రోలజాలనట్లు ఎంతటిఘనమైన విద్యనైనను ప్రస్తుతప్రభుత్వముక్రింద మనము స్వీకరించుట పాపభూయిష్టమని నానమ్మకము.

' ' ' ' '

విద్యార్థులు సహాయపడక పోయినను, ప్లీడర్లు కాని ధని కులుగాని సహాయము చేయక పోయినను, స్వరాజ్యసంపాదన దుర్లభము కాదు. అది యెక్కువగా వ్యవసాయదారులపైనను పాటకపు జనముపైనను నాధారపడియున్నది.

, , , , ,

విశ్వాస, గౌరవ, సహాయములను, కోల్పోవునట్లు ప్రవర్తించిన ప్రభుత్వముతో సహకారము చేయుట లజ్జాకర మని తోచునట్లు యనురాగశూన్యతను కలుగజేయుటే నా యుపన్యాసముల యుద్దేశ్యము.

, , , , ,

వర్తక దురాశచే యొకమహాదేశమును, యందలి ప్రజలను నిర్వీర్యము జేయుటకంటె బ్రిటిషుప్రభుత్వమును గర్హించుటకు మరేమి కావలెను.

, , , , ,

౪

శాసనసభలచాటున మరుగుపడియున్న నిరంకుశాధికారముకన్న సైనిక నిరంకుశాధికారమే కోటిరెట్లు సుఖప్రదము.

, , , , ,

శరీరమునకు మలమెట్టిదో భారత దేశమునకు విదేశ వస్త్ర మట్టిదే. శరీరారోగ్యమునకు మాలిన్య నాశనమును

గావించు టెట్లావశ్యకమో యట్లే భారతమోక్షమునకు విదేశవస్త్రము నరికట్టవలెను.

॥ ॥ ॥ ॥ ॥

శాసనసభలు దృఢమనస్కులను తయారుజేయు యంత్రశాలలు గాజాలవు. దృఢమనస్కులు లేని స్వాతంత్ర్యము నీటిబుగ్గవంటిది.

॥ ॥ ॥ ॥ ॥

శాంతమై, గభీరమైన భారతనీలాకాశమున మానవాంగుష్టమాత్రముగా నొక మేఘము కాన్పించవచ్చును. కాని యది ఏనాడు ఎట్టి ఘనఘనారావ ఘోరజీమూత సంకులమగునో ఎవరికెఱుక !

॥ ॥ ॥ ॥ ॥

శాంతముతో కూడిన సత్యమే జయము.

॥ ॥ ॥ ॥ ॥

స

సానిమెరుగులు, సంత మెరుగులుపెట్టి కొన్ని మార్పులను కలిగించినంతమాత్రముచే ప్రజాస్వామిక ప్రభుత్వము కాజాలదు. ప్రభుత్వహృదయము మారినగాని లాభము లేదు.

॥ ॥ ॥ ॥ ॥

స్వాతంత్ర్యప్రాప్తికొరకు మన మెవరియాజ్ఞకొరకును దోసిలొగ్గవలసిన పని ఎన్నడును లేదు.

॥ ॥ ॥ ॥ ॥

స్వరాజ్య మన రామరాజ్యము. ప్రపంచమున ధర్మ రాజ్యమును స్థాపించుటే దానియర్థము.

‌‌ ‌ ‌ ‌ ‌

స్వాతంత్ర్య మెప్పుడును జయిలుగోడల మధ్యను, యొక్కొక్కప్పుడు యురి స్తంభముల వద్దను మాత్రమే వరింప బడుచుండును. అదెన్నడును పాఠశాలలలోను శాసనసౌధము లలోను దొరకనేరదు.

స్వేచ్ఛావర్తకము హిందూదేశమునకు వెనుభూతమై శాశ్వతదాస్యమున పడవైచెను.

స్వాతంత్ర్యమును సంపాదించుటకు మనము చచ్చిపో వువరకును కష్టముల నెదుర్కొనుటకు సంసిద్ధులము కావ లెను. శరీరమును దాచుకొనువాడు నశించును.

స్త్రీలు తమ విదేశవస్త్రముల నన్నిటిని పూర్తిగ విడిచిపెట్టినగాని విదేశవస్త్రబహిష్కరణము పూర్తికానేరదు.

సత్యాగ్రహ రంగములో ప్రజల తప్పిదములే లెక్క కువచ్చును.

స్వాతంత్ర్యతరంగముల నుద్బోధింపజేయు గుఱువృక్షల ప్రోల తరుచ్ఛాయలందుగాని, నిరాడంబరమైనను మనో హరమైన కుటీరవాకిటలనుగాని మనబాలురు స్వేచ్ఛా వా తావరణమును గ్రోలుచుండుట యెంతయుక్తము !

( ( ( ( (

స్త్రీల సుగుణసంపత్తి, కరవు కాటములనుండి కాచు కొనుట, ధరలు తగ్గుట, ఇవన్నియు వడుకుపరిశ్రమలో నిమిడి యున్నవి.

( ( ( ( (

నగటున రోజు కైదుగంటల చొప్పున యొకజాతి పనిచేయుచున్నదనుకొనుము. అదైనను ఐచ్ఛికముగా గాక బలవంతమే. ఇదియే హిందూదేశము యొక్క నిజమైనయవస్థ.

( ( ( ( (

సహకారము మన యధఃపతనమునకు యగౌరవము నకు, మతవిశ్వాశములకు హానిచేయుటకు తోడ్పడునపుడు సహాయనిరాకరణమే మన విధ్యుక్తము.

( ( ( ( (

సత్యాన్వేషణ మనగా మనవిరోధికి దౌర్జన్యము పల్కుట గాదు. వానిని తప్పిదమునుండి రక్షింపవలెను. తను బాధనొందుటయే శాంతము. మనసిద్ధాంతము ప్రకారము ఇతరులకు బాధించకుండ మనమే బాధనొంది సత్యమునకు జయము చేకూర్చవలెను.

( ( ( ( (

సైతాను తనలక్ష్యములకు మెరుగుపెట్టి యవి సదా గౌరవపాత్రములని భ్రమింపజేయుటకు పైకి నీతిసాధనములను నీతివాక్చాతుర్యమును ధరించుచుండును.

ι ι ι ι ι

స్వదేశీవ్రతము మనపాలిటి కామధేనువు. అది మన యభీష్టము లన్నిటిని నెరవేర్చుచు అనేక క్లిష్టసమస్యలను రూపుమాపును.

ι ι ι ι ι

సంస్కరణలతో దేశము మరింత అధ్వాన్నమయ్యెను. సాంవత్సరిక ప్రభుత్వవ్యయము హెచ్చిపోయెను. ఎక్కువ ధ్యానించుకొలది యీపద్ధతితో ముసుగులో గుద్దులాట పెట్టుకొనిన లాభముండజాలదను నావిశ్వాసము బలముగుచున్నది. సంపూర్ణమైన పరివర్తన మిప్పుడత్యవసరమై యున్నది.

ι ι ι ι ι

సాత్వికనిరోధము రాజునకును ప్రజలకునుగూడ ఉభయతారకమైనది. ప్రభుత్వమునుగాని మరెవరినిగాని ప్రేమించుటలో సాత్వికనిరోధకుడు ఎన్నడును కొరవడడు. అతడు భగవద్భక్తుడు. దానికితప్ప మరేశక్తికిని జడియడు. రాజులకు భయపడి తన విధ్యుక్తమార్గము నెన్నడునువదలడు.

ι ι ι ι ι

స్వరాజ్యసంస్థాపనకు అస్పృశ్యతను తొలగించుట, ఖద్దరు నభివృద్ధిపరచుట, హిందూమహమ్మదీయ ఐక్యత, ద్రాక్షస్యరాహిత్యము అనునాలుగు, నాలుగు స్తంభములు. తాత్కాలికముగా గాక శాశ్వతములైన యీ నాలుగు స్తంభములపైనను స్వరాజ్యసౌధము నిర్మింపబడవలయును.

( ( ( ( (

మనము స్వరాజ్యమును సంపాదించుకొనవచ్చును; విడిపించుకొనవచ్చును. కాని ప్రతివాడును నాయకుడై ధర్మపన్నములను బోధించుచు క్రియాశూన్యుడైనచో ఎడతెగని కష్టములే సంభవించుచుండును.

( ( ( ( (

స్వరాజ్యము భారతదేశముయొక్క జన్మహక్కు. బ్రిటిషుపరిపాలన దానిని వంచించెను. భారతదేశము కోల్పోయిన స్వాతంత్ర్యమును మరల సంపాదించుకొనుటకు పాటుబడుచున్నది.

( ( ( ( (

స్వరాజ్యమనగా అధమాధమము దేశముయొక్క ఆర్థికజీవనమునకు ఊపిరితిత్తులవంటి దేశీయ పరిశ్రమలను సంరక్షించుకొనుచు వాటిని భంగపరచు విదేశదిగుమతులను నిరోధించుశక్తియే.

( ( ( ( (

# హ

హిందువులకు గోవు ప్రాణతుల్యము. కనుక మహమ్మదీయులైచ్ఛికముగ తమతోటి హిందువులతో సమరసభావమునకు రావలెను.

। । । । ।

హిందూమహమ్మదీయ ఐక్యత కుదరనిచో ఆచంద్రార్కము బానిసత్వముతప్ప వేరేమికలదు.

। । । । ।

హిందూమహమ్మదీయులు పరస్పరాను మాన వీక్షణములను వీడి ఒకరికొకరు అన్యాయములను గావించుకొనుట యసంభవమని విశ్వసింపవలెను.

। । । । ।

హిందూదేశము కత్తిని చేబట్టి తాత్కాలిక జయమును పొందినను పొందవచ్చును. కాని నాహృదయమట్టి భారతదేశ సందేశమునకు గర్వింపజాలదు.

। । । । ।

హిందూదేశమునకు బోల్షివిజము అవసరములేదు. అరాచకమును భరించుటకు ప్రజలు అతి శాంతయుతులు. మన కిప్పుడు బాహ్యమునకు గాన్పించు ఏదోయొక క్రమమునెవరు తేగలిగిననుసరే వారికి ప్రజలు తల యొగ్గెదరు.

। । । । ।

హిందువులు అస్పృశ్యతను తీసివేయలేని ఒక్కవత్సరముకాదుకదా నూరేండ్లకైనను మనకు స్వరాజ్యము లభింపనేరదు.

। । । । ।

హిందూదేశము దినదినము దారిద్ర్య భూయిష్టమగుచున్నది. ఆమె పాదముల దగ్గరనున్న రక్తప్రవాహమంతయు కొంచెమించుమించుగా కట్టువడినది. ఇప్పుడైనను మనము జాగ్రత్తను తీసికొనమేని అది త్వరలో మృతినొందగలదు.

। । । । ।

హిందూమహమ్మదీయులమధ్య కలుగు కలహములకు కారణము ఒకరి అభిప్రాయము లొకరిపై రుద్దుటకు ప్రయత్నించుటయే. ఉభయులమధ్య ఐకమత్యము కలుగవలెననిన ఒకరియెడల నొకరు మతసహనమును విశ్వాసమును కలిగియుండవలెను.

। । । ।

హిందూమతమునందు జన్మించిన ఏ మానవునైనను అస్పృశ్యుడనిగాని మైలపడినవాడనిగాని ఎంచుట మహాపాతకము. అట్లుచేయుటకంటె రాక్షస కృత్యము మరొకటి లేదు.

। । । ।

హైందవ జాతీయత స్వార్థపరమును అహంకారపూరితమును వినాశకరమును అయినదికాక ఆరోగ్యప్రదమును ధర్మపూరితమును ప్రేమకునిలయమైనదియును నయియున్నది.

। । । ।

హిందూదేశము స్వరాజ్య సంపాదనామార్గమునకు దౌర్జన్యసూత్రమును అవలంబించెనేని స్వరాజ్యముచేకూరక పోవుటయేగాక ప్రచ్ఛన్నదాస్యమునకు లోనగును.

ι ι ι ι ι

హిందూదేశము ఇంగ్లీషువారి స్వలాభముకొరకే పాలింపబడుచున్నది. హైందవజాతీయతాభి వృద్ధికొరకిది గొప్ప యడ్డంకు. ప్రత్తివ్యాపారముపై వారికున్న అభిమానము చాలసాంప్రదాయవిరుద్ధము. కనుకనే అది జాతీయాభివృద్ధికి పరమశతృవు. విదేశవస్త్రబహిష్కరణము ఇంగ్లీషువారికే గాక విదేశీయులందరికి నోట దుమ్ముకొట్టినదగును.

ι ι ι ι ι

హిందువులైన మనమేరినిగాని నీచులని, తక్కువవారని, దోషులని తలంచరాదు. పంచములను అస్పృశ్యులనుగా జూచుట మానవలెను.

ι ι ι ι ι

హిందూదేశముయొక్క ఆర్థికసంపత్తు పదిహేనువందల సంవత్సరములనుంచి నదీప్రవాహామువలె కొట్టుకుపోవుచున్నవిధమునుజూచి ఎంతకాలముసహించి యూరకుందుమో లేక, ప్రోత్సాహముచేయుదుమో అంతకాలము హిందూదేశము స్వాతంత్ర్యమును పొందజాలదు. విదేశవస్తు బహిష్కరణమునకు ప్రధానాంగము విదేశవస్త్రబహిష్కారమే.

ι ι ι ι ι

## క్ష

క్షమించుటయన మరచిపోవుటకాదు. స్నేహితుడు కాడనుసంగతి మరచిపోయి మన మొక శత్రువును ప్రేమించుటలో ఘనతలేదు. మనము ప్రేమించుచున్నది మన శత్రువునే యను పూర్ణజ్ఞానముతో ప్రేమించుటలో ఘనతయున్నది.



# రాచకీయములు.

ప్రజల యనుమతిమీదను వారికోరికల ప్రకారమును జరుగుచున్నంతవరకు ప్రభుత్వము ప్రజాసేవచేయు సంస్థయే యగును. కాని సన్నిపాట్లతో ప్రజలను లొంగదీసికొన జూచు ప్రభుత్వము రాక్షసరూపమును దాల్చును.

, , , , ,

నేను జ్ఞానజ్యోతిని సరిగాగ్రహించి ఆయాదేశమునాచరణకు తెచ్చితినేని ధన్యుడనగుదును. నాతోటిపాటు ఏ కొంతమందియైనను రాగలిగిరేని నాకంతకంటె కావలసిన దేమియు లేదు.

, , , , ,

ఈసామ్రాజ్యముయొక్క ప్రస్తుత ప్రతినిధులందరును అన్యాయ ప్రవర్తనకుదిగిరి; వారు గుండెలుతీసిన బంట్లు. వారికి ప్రజలకోరికలపట్ల ఆవంతయు గౌరవము లేదు. భారత గౌరవమును వారు తృణప్రాయముగ జూతురు.

, , , , ,

ప్రతిపౌరుడును ఏదోవిధముగ తనకు తెలియకపోయినను ప్రస్తుత ప్రభుత్వమునకు సహాయమును చేయుచునేయు

న్నాడు. కనుక ప్రభుత్వ చర్యలన్నిటికిని వారందరును ఉత్తర వాదులగుచున్నారు.

, , , , ,

ప్రజాభివృద్ధికొరకే ప్రభుత్వము లేర్పడినవి. ప్రజాభివృద్ధిని జూడని ప్రభుత్వమును ప్రజలు తోడ్పడనక్కరలేదు.

, , , , ,

ప్రజాస్వామిక ప్రభుత్వములని పిలువబడుచున్నవన్నియు సంఘములోని దోషములను నిర్మూలముచేసి స్వర్గమును సృష్టించుననుకొంటిమి. కాని మధ్యయుగము నాటి చిన్నచిన్న రాజుల చట్టవిహీనమైన పరిపాలనలకంటె నివి మరింత అధ్వాన్న మయ్యెను.

, , , , ,

ప్రస్తుత ప్రభుత్వమునకును మనము స్థాపింప బోవు దానికిని మధ్యకాలములో మనమనేక పొరపాటులను చేయవచ్చును. కొంత అక్కరలేని బాధకూడ ఉండవచ్చును. జాతియంతయు నిర్వీర్యమైపోవుటకంటె యివెంతయో మంచివి కావా!

, , , , ,

నిరపరాధుల రక్తప్రవాహమునుగావించిన ప్రభుత్వ హస్తములనుండి ఇంద్రపదవి నొందుటకంటె నాకు భిక్షాటనమే మేలు.

, , , , ,

అపరిశుద్ధ ప్రదేశములో జీవించు ప్రజలకు రోగములు తప్పనట్లు అధర్మప్రభుత్వములోని ప్రజలకు జయిలు జీవితము తప్పని సరియగును. అది వారినిత్యపంట.

ı ı ı ı ı

భారతమే నాతల్లి. నాసర్వస్వము ఆమె పెట్టిన భిక్షయే. ప్రపంచమున కామె యొక ఉత్కృష్ట సందేశమును గొంపోనున్నది. యూరపుదేశము నాపెగుడ్డిగా అనుకరించజాలదు.

ı ı ı ı ı

నిత్యదరిద్రతకు అగౌరవములకు పాలగుచు నాకొరకు చూచుచు నన్నువిశ్వసించు ప్రజలకు నేను మోక్షదేశమును పురికొల్పగలను; కాని మోక్షము, ఆశ ఈరెండును తాగ్యము, శిక్ష, ఆత్మసంయమనము లేనిదే కలుగజాలవు.

ı ı ı ı ı

తిరస్కారభావమును చూపుచు పనిచేయు మంత్రిత్వముకంటె పనిచేయుట కిచ్ఛగించక లేచివచ్చుటే చాల మంచిది. తిరస్కరించుచు సేవచేయుచుండుటవలన సహించరానంత దుర్భరముగ లేదని చూపుచుండును.

ı ı ı ı ı

కోర్టువ్యవహారములు జూదపు పందెములుగా భావింపబడుచున్నవి. ఇంతకన్న వేరు సత్యములేదు. నీకేసులో

యెంతసత్యమున్నను, యెంతన్యాయమున్నను నెగ్గగలనని నీ వెన్నడును చెప్పజాలవు.

। । । । ।

ప్రస్తుత న్యాయపరిపాలనా పద్ధతిలోని దుర్భర విష యమేమన ప్రజలు చెప్పరాని యవినీతికి తేబడిరి. రక్తపా తము, మోసము, వర్తకదోపిడి- నీకివియే పాశ్చాత్య దేశములలో కాన్పించుచున్నవి. కాని మానవలోక మం తయు నెమ్మదిగా నిమ్మకు నీరుపోసినట్లు సౌభాగ్యప్రద మైన నూతనయుగమును సృష్టించుటకే పనిచేయుచున్నది.

। । । । ।

సామ్రాజ్యము హిందూదేశమున కేమిచేయుచున్న దో చూడుడు:—గ్రేటుబ్రిటనుయొక్క లాభము కొరకు మనదేశములోని పెన్నిధానముల నన్నిటిని కొల్లగొనుట; నిరంతరము పెరిగిపోవుచున్న సైనికవ్యయము; ప్రపంచ ములో యెక్కడను లేనంతటి వ్యయమును చేయుచున్న సివి లు సర్వీసు ఉద్యోగములు; మనమధ్యనున్న కొద్దిమంది ఆంగ్లేయులకు ప్రాణహాని రావచ్చునను భయమున, జాతినం తను ఆయుధహీనముచేసి నిర్వీర్యులనుచేయుట; తలకుమించి న ప్రభుత్వ వ్యయములనన్నిటిని పోషించుటకుగాను బుద్ధినా శనము గావించు మద్యము మొదలగు అపానపానీయము, నల్లమందు మొదలగు వాటియొక్క వర్తకము; జాతీయ మ

నోవ్యధను వ్యక్తము యుచు, వలసరాజ్యములలో మనము పొందుచున్న అగౌరవములను వెల్లడిచేయు జాతీయాందోళనము పెరుగకుండ అరికట్టుటకు చేయు నిరంతర నిర్బంధశాసనములు మనకు కలుగుచున్నవి.

। । । । ।

రాతియుగముకంటె ఉక్కుయుగము మంచిదను సంగతి నాకర్థముకాదు. నాకు రెండును సమానమే. ఆత్మాభివృద్ధికే మనము మనబుద్ధిని, మన సమస్తశక్తులను వినియోగించవలెను.

। । । । ।

భారతజాతీయత యెన్నటికిని సంకుచితము, వినాశకరము, ఇతరులపైకి దూకునది కాదు. అది యారోగ్య మత భూయిష్ఠము; కనుకనే యది మానవకళ్యాణమునే కోరును.

। । । । ।

ధైర్యము శరీరలక్షణముకాదు. అది మానసిక లక్షణము. కండలు పెంచినవారిలో నే ననేకమంది పిరికిపందలను జూచితిని. దుర్బలశరీరములో ధైర్యసాహసములు మూర్తీభవించుట నేనెరుగుదును.

। । । । ।

కలకత్తాలోని విలియముకోట తదితర మహాసౌధములు, నోరులేని, విజ్ఞానధనులైన ప్రజలను నిష్కారణముగ కొల్లగొనుటను గాక మరేమి సూచించును !

। । । । ।

ఇంగ్లీషువారికి దూరదృష్టి యెక్కువ. వారు మనకు ఊరికే న్యాయదానము చేయరు. మనలో వారిని ప్రతిఘటించుశక్తి, దార్ఢ్యశక్తి యగుగాక, దార్ఢ్యరాహిత్యమగుగాక- ఏదియైనను శక్తియున్నప్పుడే న్యాయమును కలుగజేసెదరు.

। । । । ।

గడిబిడలను కలుగజేయు పత్రికలను, అసత్యములను ప్రచారముచేయు పత్రికలను ఎదుర్కొనుటకు మనమొక నూతన పద్ధతిని కనిపెట్టవలెను.

। । । । ।

భారతదేశమునకు న్యాయము కలుగజేయలేని సామ్రాజ్యమును నాశనముచేయుటే ప్రతి భారతీయునియొక్క విధాయకధర్మమని యాంగ్లేయులు గుర్తెరుగుదురుగాక!

। । । । ।

రైళ్లు, హాసుపత్రులు గొప్ప విశుద్ధ విజ్ఞానమును సూచింపజాలవు. అవి తప్పనిసరియైన దోషములు మాత్రమే యని మనమెరుగవలెను.

। । । । ।

ఒక్క లక్షమంది ఆంగ్లయాత్రికులు 3000 లక్షల మంది కలజాతిని శాసించుటయనది పాలకులకును పాలితులకును కూడ నీతిబాహ్యము ; సిగ్గుచేటు

׀ ׀ ׀ ׀ ׀

హిందూదేశములో శాంతి, రాజభక్తి, వ్యక్తిఅభిప్రాయములు, ఇవన్నియు విచ్చుకత్తులతో కాపాడబడుచున్నవి. ప్రజలుమాత్రమే నిరాయుధులు చేయబడిరి.

׀ ׀ ׀ ׀ ׀

అధర్మమైన చట్టములకు తలయొగ్గుట మగతనము కాదని గుర్తించిన చాలును. ఎట్టి నిరంకుశత్వమును అట్టి వారిని వశము చేసికొన జాలదు. ఇదియే స్వరాజ్యమునకు కీలకము.





# ఆర్థికములు.

స్వేచ్ఛావాణిజ్యము హిందూదేశమునకు మహాపకారమును చేసెను. అది దానిని నిరంతర దాస్యములో ముంచివేసెను.

॥ ॥ ॥ ॥ ॥

ఇతర దేశములతో వర్తకపోటీకి నిల్చుట రాటము యొక్క అభిప్రాయము కాదు. దేశములో వృధాగా పాడు చేయబడుచున్న జాతీయపాటుచు (National Labour) సేకరించుకొని నిత్యము పెరుగుచున్న దేశదారిద్ర్యమును తగ్గించుకొనుటే దాని ప్రధానోద్దేశ్యము.

॥ ॥ ॥ ॥ ॥

ఆంగ్లచరిత్రకారులు వ్రాసినట్లు మాంచెస్టరుగుడ్డలు మనదేశముపై బలవంతముగ ప్రవేశపెట్టబడినవి. ప్రపంచాధిక్యతను బడసిన మన డక్కా-మస్లినులు బుద్ధిపూర్వకముగ, ప్రయత్నపూర్వకముగ నాశనము గావింపబడినవి

॥ ॥ ॥ ॥ ॥

నీతిని, ఆచారములను గణనసేయని ఆర్థికశాస్త్రము మైనపు బొమ్మవంటిది. అందులో ప్రాణమున్నట్లున్నను ప్రాణశక్తి శూన్యమగుచున్నది.

॥ ॥ ॥ ॥

మనపట్టణములే హిందూదేశమని యెవరును మోసపోకూడదు. హిందూదేశము తన ఏడున్నరలక్షల పల్లెటూళ్లలోనే జీవించుచున్నది. మనపట్టణములు ఆపల్లెటూళ్లమీద

జీవించుచున్నవి. అవేయి తమ యైశ్వర్యమును యితర దేశములనుండి తెచ్చుటలేదు.

। । । । ।

పట్టణవాసులందరును యూరపు అమెరికా జపానుల లోని పెద్దపెద్ద ఇళ్లకు కమిషనుదారులు, దళారీలు. గత రెండువందల ఏళ్లనుండియు మనదేశమునుండి పోవుచున్న ధనప్రవాహమునకు వీరు పైవారితో చేతులు కలిపిరి.

। । । । ।

ఇతరదేశములలో పశువుల దుస్థితి మనదౌర్భాగ్యదేశములో నున్నంత కడుదీనముగ లేదు. మనము దీనికి ఆంగ్లేయులను దూషించ నక్కరలేదు. మనము దరిద్రులమనుసాకును చూపనక్కరలేదు. మన పశువులు దుర్భరస్థితిలో నుండుటకు కారణము మననిర్లక్ష్యభావమే. మనము వాటిపట్లను, దేశము యెడలను మహానేరమును గావించుచున్నారము.

। । । । ।

ఎట్టిమాయావాదము, ఎట్టిలెక్కల తాంత్రికము ప్రతి పల్లెటూరులోను మనకు ప్రత్యక్షముగ కాన్పించు మానవ అస్థిపంజరములను బొంకరించ జాలవు.

। । । । ।

నేనుచెప్పిన స్వదేశవ్రతమే నిజమైన ఆర్థికశాస్త్రము. ఆంగ్లేయుల ఆర్థికశాస్త్రమును మనమనుకరించుట మన వినాశహేతువగును.

। । । । ।

యంత్రములు యూరపును నాశనము చేయుటకు మొదలుపెట్టినవి. నాశనదేవత యిపుడు ఇంగ్లాండుయొక్క తలుపులను తట్టుచున్నది.

/ / / / /

హిందూదేశము పట్టణములను, యంత్రములను కోరలేదు. పురాతనరాటము, పురాతనవిద్యావిధానము భారత సౌభాగ్యమును, విజ్ఞానమును పెంపొందించినవి. ఇంకను పెంపొందించగలవు.

/ / / / /

మనము కాంగ్రెసు ప్లాటుఫారములమీద యీ 35 వత్సరములనుండియు కావలసినంత వాగ్జాలమును వడికితిమి. భారతదేశమునకు నిజముగ కావలసిననూలును మనమిప్పుడు తయారు చేయవలసినసమయ మేతెంచెను. నిరుపేదల ఆకలి తీర్చుటకు, మానమును కాపాడుటకు మనకింతకన్న వేరు మార్గము లేదని నాయభిప్రాయము.

/ / / / /

మతమునకును రాచకీయములకును సంబంధము లేదనుటలో యర్థము లేదు. మతము లేని రాచకీయము దహనము చేయవలసిన శవమువంటిది.



## శాశ్వతపోషకులు.

1. శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, చెన్నపట్టణం.
2. నడింపల్లి సుబ్బరాజుగారు, కోడూరుపాడు.
3. జాజాల చలమయ్యశాస్త్రిగారు, రాజమండ్రి.
4. దేవులపల్లి సోమయ్యగారు, ఆకిరిపల్లి.
5. చింతలపాటి బాపిరాజుగారు, పత్తేపురం.
6. తాడి పెదసూర్యయ్యగారు, నత్తారామేశ్వరం.
7. బెజవాడ రామచంద్రారెడ్డిగారు, బుచ్చిరెడ్డిపాలెం.

## రాజపోషకులు.

8. దామోజీపురపు సత్యాధిరావుగారు, కొవ్వూరు.
9. శ్రీరాజా వెంకటాద్రి అప్పారావు బహద్దరు జమీందారువారు, నూజివీడు.
10. చేడ నారాయణమూర్తిగారు, తొండంగి.
11. పెన్మెత్స రాజంరాజుగారి కుమారులు సత్యనారాయణ రాజుగారు, రేలంగి.
12. రావుసాహేబ్ కల్లి చిట్టిఅబ్బాయినాయుడుగారు, పూళ్ల.
13. పసల సోమయ్యగారు, తాడేపల్లిగూడెం.
14. ముళ్లపూడి తిమ్మరాజుగారు, జమీందారు, తణుకు.
15. ఇందుకూరి సీతారామరాజు, లక్ష్మీపతిరాజుగార్లు, దువ్వ.
16. ద్వారంపూడి సూదరయ్యగారు, నత్తారామేశ్వరం.
17. ద్వారంపూడి వెంకయ్యగారు, నత్తారామేశ్వరం.
18. వెలగల బాపిరెడ్డి సుబ్బారెడ్డిగార్లు, ఆకవల్లి.
19. వెలగల శ్రీరామరెడ్డి, తాడి నాగిరెడ్డిగార్లు, ఆకవల్లి.
20. జవ్వాది లక్ష్మయ్యగారు, పెనుగొండ.

21. డాక్టరు తేతలి సత్యనారాయణగారు, తాడేపల్లిగూడెం

22. గాడేపల్లి సత్యనారాయణగారు, వకీల్, రామచంద్రపురం.

23. నుంకవల్లి సుబ్బారాయుడు బ్రదర్సు, నాచుగుంట.

24. పేరి విశ్వనాథశర్మగారు, బండార్లంక.

## పోషకులు.

25. డాక్టరు జీడిగుంట రామరాజుగారు, నిడదవోలు.

26. పల్ల సూర్యనారాయణగారు, వకీల్, కొవ్వూరు.

27. బలిజేపల్లి సుబ్రహ్మణ్యంగారు, వకీల్, తణుకు.

28. తల్లాప్రగడ కామేశ్వరరావు, భీమేశ్వరరావుగార్లు. ఉంగుటూరు.

29. బోళ్ల వెంకటరత్నంగారు, పెదపట్నమగ్రహారం.

30. దేవులపల్లి రామమూర్తిశాస్త్రిగారు, తిమ్మరాజుపాలెం.

31. ఇందుకూరి సుబ్బరాజుగారు, పిప్పర.

32. మాజేటి రామచంద్రరావుగారు, ఏలూరు.

33. గాడేపల్లి హనుమానులుగారు, అత్తిలి.

34. డాక్టరు బొమ్మకంటి రామమూర్తిశర్మగారు, నిడదవోలు.

35. ఆరుమిల్లి వెంకటసుబ్బారాయుడుగారు, నాగుల్లంక.

36. అక్కవ తిరుపతిరాయుడుగారు, రాజమండ్రి.

37. తేతలి సీతారామయ్యగారు, తేతల

38. రెబ్బాప్రగడ మందేశ్వరశర్మగారు, కొవ్వూరు.

39. నీరుకొండ వెంకటరత్నంగారు, వంగలపూడి.

40. విష్ణువఝుల లక్ష్మీనారాయణగారు, చిలకలంపాడు.

41. శివరాజు వెంకటరామారావుగారు, రాజమండ్రి.

42. విలావఝుల రామబ్రహ్మం సన్సు, కొవ్వూరు.

43. తాటిపేటి విశ్వనాథంగారు.

---

79

# పల్లెటూరు గ్రంథమండలి,

## తణుకు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | గాంధిమహాత్ముని నీతిమంజరి. | 0 | 2 | 0 |
| 2 | రాజనీతిసారము. | 0 | 3 | 0 |
| 3 | ప్రాచీనభారతగ్రామపరిపాలన. | 0 | 3 | 0 |
| 4 | రామతీర్థస్వామి బ్రహ్మజ్ఞానోద్బోధములు వాల్యూం 1 | 0 | 10 | 0 |
| 5 | కర్మయోగి ఆదర్శము. | 0 | 3 | 0 |
| 6 | భారతస్వరాజ్యయుద్ధము. | 0 | 6 | 0 |
| 7 | ఆర్యుల ఆదర్శము. | 0 | 6 | 0 |
| 8 | వినాయక సావర్కారు జీవితము. | 0 | 12 | 0 |
| 9 | మహారాణి ఝాన్సీలక్ష్మీబాయి. | 0 | 12 | 0 |

చందాదారులుగాగోరువారు 0-4-0 ప్రవేశరుసుమును చెల్లించవలెను. చందా సంవత్సరముకు రు 2-0-0 మాత్రమే. సంవత్సరముకు మూడుపుస్తకములు వెలువడును. పోస్టేజి ప్రత్యేకము.



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA107B167 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 77 |
| పెద్ద సైజు పేజీలు | |
| ఖాళీ పేజీలు | 1, 73 |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Ch. Ramya |
| పేజీలు విడదీసినది | Jhasin |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | Good |